# పాడి పరిశ్రమ

పాలు మంచి ఆహారం. పసిపాపలకి, ముసలివారికి సులభంగా అరుగుతాయి. వయసులోని వారికి కూడా మంచివి. పాలనుంచి పెరుగు, వెన్న, నెయ్యి తయారవుతాయి. ఇవి కూడా వంటికి బలం. రైతు పొలాలలో పంటలు పండించి లాభాలు సంపాదిస్తాడు. దానికి తోడుగా పాడి పరిశ్రమ ఒక మంచి ఉపాధి.

## మనకి ఎన్ని పాలు కావాలి

పాడి పరిశ్రమ ఇటీవల ఎంతో పురోగతి సాధించింది. పాలదిగుబడి అధికం అయింది. ప్రపంచంలో ఇలా మనది రెండో స్థానం అయింది. అయినా సగటున అవసరమైన పాలు అందరికి అందడం లేదు. ఇది మన రాష్ట్రంలో ఈనాటి పరిస్థితి.

దీనికి మూడు కారణాలు ఉన్నాయి. పశుగ్రాసం తగినంత లేదు. మన పశువులు నాసిరకానివి. జనాభా పెరిగిపోతోంది. మన దేశంలో చాలా రాష్ట్రాలున్నాయి. పాలదిగుబడిలో మనది ఆరోస్థానం. అయినా సగటున రోజుకి ఆరుగురికి ఒక లీటరు పాలే అందుతున్నాయి. ఇది చాలదు. మనిషికి కనీసం రోజుకు పావు లీటరు పాలు కావాలి.

మనరాష్ట్రంలో చాలా పాడి పశువులు ఉన్నాయి. ఒక కోటి వరకు ఉంటాయని అంచనా. అయితే ఇవి దేశవాళివి. నాసిరకం.

పాల దిగుబడి తక్కువ.

## సంకర జాతి

ఈనాడు ప్రభుత్వమే ఈ రంగంలో ఉంది. చాలా చర్యలు ఆచరణలో పెడుతోంది. మేలిరకాల పశువులను పెంచాలని పట్టుదలతో ఉంది. వాటి ఆరోగ్యం గురించి చాలా శ్రద్ధ చూపుతోంది. అధికంగా పాలిచ్చే సంకర జాతులను ఉత్పత్తిచేస్తోంది.

వీటిని ఆసరాచేసుకొని రైతు ముందుకు పోవాలి. ఒక మంచి పాడి పశువు ఒక ఎకరం భూమితో సమానం. కరవులు రావచ్చు, వరదలు ఊరి మీద పడవచ్చు. కాని ఇవేవి పాడి పరిశ్రమకి అడ్డురావు. ఏడాది పొడవునా పాడి పరిశ్రమ ఆదాయం ఇస్తుంది.

నీటి ఎద్దడి, కరవు ఉండే మండలాలు ఉన్నాయి. వారు పాడి పరిశ్రమకి బాగా పూను కోవాలి. ఈ రోజుల్లో కొత్త కొత్త విధానాలు అమలులో ఉన్నాయి. రైతులు లాభాలు పొందుతున్నారు. ప్రజల జీవన విధానం మెరుగయింది. కాని ఇంకా చేయవలసినది చాలా ఉంది.

పాడిపశువులు నాసిరకం అయితే దాణాఖర్చు పెరుగుతుంది. పాలదిగుబడి మాత్రం పెరుగదు. అందువల్ల నాసిరకం మగ దూడల విత్తులు ఏడాది లోపల కొట్టాలి. పాలసార ఉన్న మేలురకాల పశువుల్ని మాత్రం పెంచుకోవాలి. గ్రాస వనరులు సరిగా వాడుకోవాలి.

## జతకట్టకుండానే చూలు కడతాయి

జతకట్టడానికి మేలురకం ఆంబోతులు ఉండాలి. అయితే ఈ

నాడు ఇలా జత కట్టవలసిన అవసరంలేదు. పశువులు చూలు కట్టడానికి సూది విధానం ఉంది. మన రాష్ట్రంలో 15 సంవత్సరాల నుంచి దీనిని అమలు చేస్తున్నారు. అయినా మంచి ఫలితం సాధించలేక పోయాము. సగటున ఎనిమిది పశువుల్లో ఒకదానికే లభిస్తోంది. మొత్తానికి ఈ కార్యక్రమం నత్తనడకలాగా సాగుతోంది. ఇలా నెమ్మదిగా జరిగితే లాభం లేదు. మరో 15 సంవత్సరాలు గడిచినా సగం పశువులే ఇలా చూలు కడతాయి. మిగతా సగం నాసిరకం వాటినే కంటాయి.

## పల్లెల్లో మంచి అవకాశం

సూది విధానం ఒక ఉద్యమంలాగా సాగాలి. గత అయిదు సంవత్సరాలలో ఈ కార్యక్రమం కుంటుపడింది. ఈ నిజాన్ని మనం తెలుసుకోవాలి. గ్రామాల్లో యువకులకి పనులు దొరకడం లేదు. అలాటివారు ఈ కార్యక్రమాల్లో విరివిగా కృషి చేయాలి. ఉత్సాహంతో పనిచేయాలి. వారికి ఉపాధి దొరుకుతుంది. ఆ విధంగా సంకరజాతి పశువులు అధికం అవుతాయి. ధర తగ్గుతుంది. పాలు అందరికి సమృద్ధిగా దొరుకుతాయి. రైతుల ఆర్థిక పరిస్థితి మెరుగుపడుతుంది. పల్లెలు ఆరోగ్యంగా సంపదతో కళకళలాడతాయి.

## పాడి పరిశ్రమలో సూత్రాలు

గ్రామీణులు ఈ కార్యక్రమంలో బాగా పాల్గొనాలి. దీనికి అయిదు సూత్రాలు పాటించాలి.

1. మంచి పాల సార ఉన్న పశువులనే పెంచుకోవాలి.
2. ఆ పశువులు తొందరగా ఎదకి రావాలి.

3. వాటికి మంచి దాణా ఇవ్వాలి.
4. రోగాలు రాకుండా జాగ్రతలు తీసికోవాలి. అవసరమైతే మందులు వెంట వెంటనే ఇవ్వాలి.
5. యాజమాన్యం సరిగా పాటించాలి. వీలయినంత తక్కువ ఖర్చు చేయాలి. అధికంగా లాభాలు పొందాలి.

## సంకర జాతుల సదుపాయం

సంకర జాతులు రోగాలకు సులభంగా లొంగవు. అధిక పాలను ఇస్తాయి. దేశవాళి ఆవులని మంచి మంచి విదేశీ రకాలతో జతకట్టాలి. దేశవాళి గేదెలని ముర్రాజాతి గేదెలతో జత కలపాలి. ఇలా ఈత ఈతకి వాటి నాణ్యత పెరుగుతుంది.



## పశువులు మంచివని మనకి ఎలా తెలుస్తుంది?

మంచిలక్షణాలు ఇలా ఉండాలి :

1. ఆడవి ఏపుగా ఎద్దుల్లా ఎదగ కూడదు. ఆడజాతి లక్షణాలు ఉండాలి.
2. చర్మం నున్నగా పల్చగా మెరుస్తూ ఉండాలి.
3. కళ్లు చురుగ్గా మిల మిలలాడాలి.
4. ఛాతీ వెడల్పుగా, మెడ పొట్టిగా ఉండాలి.
5. పొదుగు విశాలంగా ఉండాలి. సిల్కులాగా, నున్నగా, మెత్తగా ఉండాలి. పాలు పిదికాక పొదుగు ముడతలు పడాలి. పడకపోతే పాలు తక్కువ, కండ ఎక్కువ అని తెలుసుకోవాలి.



6. పొదుగుకు అటూ ఇటూ నరాలు ఉబ్బి బాగా కనబడాలి.
7. నాలుగు సిరలు మృదువుగా ఉండాలి. నొక్కగానే పాలు ఏక ధారగా రావాలి.
8. పొదుగు నలుచదరంగా ఉండాలి.

## పాడి పరిశ్రమలో ఈ విషయాలు బాగా తెలుసుకోవాలి

1. పశువులలో ఎలాటి రకాలు ఉంటాయి.
2. సంకర పద్ధతులతో పశువుల గుణాలు మెరుగు అవుతాయి.
3. సూది విధానంలో పశువులు చూలు కట్టి ఈనుతాయి.
4. దూడల విషయంలో జాగ్రతలు.
5. దూడల పెరుగుదలలో గమనికలు.
6. పచ్చగడ్డి నిలువ చేయడం.
7. పశురోగాలకు తగిన చికిత్సావిధానం.
8. యాజమాన్య మెళకువలు.

పశువులను ఎత్తు నేలల మీద కట్టుకోవాలి. నీటి సదుపాయం బాగుండాలి. పచ్చగడ్డి బాగా దొరకాలి. పాలు సులభంగా వేరే చోటుకి తరలించుకోవాలి.

## విదేశీ ఆవులు, సూది విధానం

కనీసం రోజుకి 6 లేదా 8 లీటర్ల పాలిచ్చే విదేశీ ఆవులను ఎంపిక చేయాలి. గతంలో వాటికి ఏ రోగాలు రాలేదని తెలుసుకోవాలి.

సాధారణంగా ఆవు ఎదకి వచ్చాక ఎద్దుతో జతకడతారు. కాని ఈ నాడు ఆ అవసరంలేదు. సూది విధానం ఉంది.

మొదట మంచి జాతికి చెందిన ఎద్దునుంచి వీర్యాన్ని తీస్తారు. ఇలా తీయడానికి తగిన పరికరాలు ఉన్నాయి. తరువాత వీర్యాన్ని పద్ధతి ప్రకారం నిలువ చేస్తారు.

ఆవు ఎదకి వచ్చాక ఈ వీర్యాన్ని వాడతారు. ఆవు చూలు కడుతుంది. ఆవు నాసిరకం కావచ్చు. కాని నాణ్యతకల దూడ పుడుతుంది.

## సూది విధానంలో మేలు ఏమిటి?

1. మంచి జాతి ఎడ్లను పెంచుకోవాలంటే చాలా ఖర్చు అవుతుంది.
2. విదేశీ జాతి ఎడ్లు చాలా అరుదు. విపరీతమైన ఖరీదు.
3. ఒకసారి ఒక ఎద్దు నుంచి తీసిన వీర్యం చాలా కాలం నిలువ చేసుకోవచ్చు. ఒక ఎద్దు వీర్యం మూడు వేల ఆవులకు సరిపోతుంది.
4. రోగాలను అదుపులో ఉంచుకోవచ్చు.
5. ఒకవేళ ఆ ఎద్దు చనిపోయిందే అనుకొందాం దాని వీర్యం ముందే తీసిఉంటాము. అప్పుడు మనకి నష్టం లేదు. 15 సంవత్సరాల వరకు ఆ వీర్యాన్ని వాడుకోవచ్చు.
6. విదేశీ ఎద్దు మన దేశానికి రానవసరం లేదు. కాని మన దేశవాళి పశువుతో జతకట్టిన ఫలితం వస్తుంది.

అయితే ఒక ముఖ్య విషయం గమనించాలి. విదేశీ లక్షణాలు పశువులో సగం మాత్రం ఉండాలి. అధికంగా ఉండ కూడదు. విదేశీ వాతావరణం వేరు. మన వాతావరణం వేరు.

అవి మన దేశంలో బతకలేవు.

అయితే ఒంగోలు జాతి ఆవులు, ముర్రా జాతి గేదెలు మన దేశానికి చెందినవే. వాటితో నాసిరకం పశువులను జత కలుపుతారు. లేదా సూది విధానం అమలు చేస్తారు. వీటి దూడలకు పూర్తి ఒంగోలు జాతి లక్షణాలు రావాలి. అలాగే పూర్తి ముర్రాజాతి లక్షణాలు రావాలి.

## ఒంగోలు జాతి

మన రాష్ట్రంలో ఒంగోలు జాతి ఆవులు, ఎద్దులు తరుచు కనబడతాయి. ఇవి మన రాష్ట్రానికే గర్వకారణం. తెల్లగా ఉంటాయి. ఎత్తుగా, ఏపుగా ఎదుగుతాయి. అయితే కొమ్ములు అంతగా ఉండవు. గంగడోలు ఉంటుంది. మూపు బలంగా ఉంటుంది. విదేశాలలో కూడా ఇది పేరుపొందింది. చాలా దేశాలకు ఎగుమతి అయింది. దీన్ని మాంసానికి వారు కొంటారు.

కాని ఇటీపల గ్రామాల్లో దీని మీద శ్రద్ధ తగ్గి పోయింది. దీనిని పెంచడం తగ్గించారు. ప్రజలు పల్లెలనుంచి నగరాలకు తరలిపోతున్నారు. గతంలో ప్రతి ఇంటి వారు ఈ ఆవులని, ఎడ్లని పెంచుకొనేవారు. అభిమానంతో పెంచుకొని పేరుపేరునా రాముా, లక్ష్మిఅని పిలిచేవారు. ఇప్పుడు అలాటి రైతులు లేరు. ఆ పశువులకి ఆలన, పాలన కరవవుతోంది.

అయితే సుమారు 10 సంవత్సరాల నుంచి లామ్ ఫారములో వీటిని పెంచుతున్నారు. ఇది గుంటూరు జిల్లాలో ఉంది. ఆ ఫారములో వీటి వీర్యాన్ని తీసి నిలువ చేస్తున్నారు. ఒక ఎద్దునుంచి తీసిన వీర్యం అయిదువేల సూది విధానాలకి సరిపోతుంది.

మంచి ఒంగోలు ఆవు రోజుకి 10 లీటర్ల పాలు ఇస్తుంది.

అయితే సామాన్యంగా ఈతకి 600 లీటర్లు ఇస్తుంది. దీనిని వెయ్యి లీటర్లకు పెంచాలని లామ్ ఫారములో ప్రయత్నిస్తున్నారు. ఒంగోలు ఆవుల చర్మం ఎండ వేడికి బాగా జారుస్తుంది. గోమార్లు వంటివి చేరవు. అసలు సిసలు ఒంగోలు గిత్త ఒంటి మీద లేత నలుపు ప్రాంతాలు ఉంటాయి. ఇవి ప్రత్యేకంగా తొమ్మిది ప్రాంతాలు. మిగతా భాగం అంతా తెల్లగా ఉంటుంది. వీటిని గుర్తించి జాతి విలువ కడతారు.

గతంలో ప్రతి పల్లెలోను అచ్చువేసిన ఆంబోతులు ఉండేవి. ఈ నాటికీ ఇవి అక్కడక్కడా కనబడతాయి. రైతులు కొన్ని ఒంగోలు దూడలను అలా వదలివేసారు. వాటికి శంకు, చక్రం, గుర్తులు వాతలు వేసేవారు. ఇవి మందల్లో తిరిగి ఆవులతో జతకూడేవి.

## ముర్రా జాతి

దేశవాళి గేదెలు పాలు బాగా ఇవ్వవు. మన దేశంలో ఇలాటి నాసిరకం గేదెలు ఎక్కువ. సుమారు 8 కోట్లు ఉన్నాయని అంచనా. ముర్రా బర్రెని మాల్వి గేదె అనీ అంటారు. ఈనాడు గ్రామాలలో, పట్టణాలలో ఇవి అధికంగా కనబడుతున్నాయి.

ముర్రాగేదె కొమ్ములు పొట్టి. చక్రంలా చుట్టి తిరిగి తల మీదకే వస్తాయి. శరీరం బలంగా ఉంటుంది. నల్లగా నిగ నిగ మెరిసి పోతూ ఉంటుంది. తోక పొడవు. చివర కుచ్చు తెల్లగా ఉంటుంది. పాలు బాగా ఇస్తాయి. నాసిరకం గేదెని ముర్రా పోతుతో జత కలుపుతారు. గేదె సంతానం మెరుగవుతుంది. మళ్లీ తిరిగి ఇలాగే చేస్తారు. ఇలా కొన్ని తరాలలో అసలైన ముర్రాజాతిలాటిదే పుడుతుంది.

## దూడల పెంపకం

గేదెలని, ఆవులని రైతులు శ్రద్ధతో పెంచుకొంటారు. అయితే దూడల విషయంలో కూడా మెళకువతో ఉండాలి. లేకపోతే సగానికి పైగా దూడలు చనిపోతాయి. తల్లి కడుపులో పడిన నాటినుంచే దూడ మీద శ్రద్ధ మొదలవాలి. తల్లికి మంచి దాణా ఇవ్వాలి. పోషకపదార్థాలు అందించాలి. దూడ పుట్టాక ముక్కు రంధ్రాలు శుభ్రం చెయ్యాలి. తల్లి చేత బాగా నాకనివ్వాలి. ఆ విధంగా దూడకి వెచ్చదనం అందుతుంది. తల్లికి, పిల్లకి మధ్య అనురాగం, అనుబంధం కలుగుతాయి. అవసరం అయితే దూడని నిలబెట్టాలి. తల్లి పాలు తాగేలా చూడాలి. గిట్టలు గిల్లివేయాలి. మూడు గంటల్లో విరోచనం అవుతుంది. లేకపోతే ఎనిమా ఇవ్వాలి.

దూడకి జున్ను పాలు ఇవ్వాలి. వాటినే ముర్రుపాలు అంటారు. ఇవి దూడకి చాలా మంచివి. దూడలకి రోగాలు రాకుండా కాపాడతాయి. ఆ పాలలో విటమినులు ఉంటాయి. రోజూ మూడు నాలుగు సార్లు తాగించాలి. ముర్రుపాలు అజీర్తి చేస్తాయనే భయంతో తాగనివ్వరు. నిజానికి జున్ను పాలు అరిగే శక్తిని ఎక్కువ చేస్తాయి. విరోచనం సక్రమంగా అవుతుంది. ఈ విషయంలో శ్రద్ధ చూపాలి.

ఈనిన తరువాత దూడని తల్లికి కనబడనీయకూడదు. జున్ను పాలలో మన చేతివేళ్లు ముంచి, ఆ వేళ్లను దూడతో నాకించాలి. అలా దూడ వేళ్లని చీకుతుంది. తరువాత పాత్రలో పాలుపోసి తాగించాలి. పాల పీక కూడా అలవాటు చేయవచ్చు.

దూడ తాగే పాలు గోరువెచ్చగా ఉండాలి. పాలకి కొద్దిగా వేడి నీళ్లు కలిపితే సులభంగా జీర్ణమవుతాయి.

## ఎన్నిపాలు తాగించాలి

దూడ బరువును ముందు తెలుసుకోవాలి. మొదటి నెలలో ఆ బరువులో పదోవంతు పాలు రోజూ తాగించాలి. రెండోనెల 15 వంతుకి తగ్గించాలి. మూడోనెల 20 వంతుకు తగ్గించాలి.

దూడలకి ఏడో రోజు నుంచి దాణా ఇవ్వాలి. దాణాని నాలిక మీద రాస్తూ ఉండాలి. అలా దాణాకి అలవాటు అవుతాయి. దాణా నీటితో తడపాలి. అలా అయితే సులభంగా జీర్ణం అవుతుంది. దూడలకి గడ్డి పరకల అలవాటు మంచిది. రెండో నెల నుంచి 5 పాళ్లు పచ్చిమేత 2 పాళ్లు ఎండు మేత ఇవ్వాలి.

## దూడ ఆరోగ్యం జాగ్రతలు

దూడలకి ఆరోగ్యపరంగా ఈ కింది జాగ్రతలు తీసికోవాలి.

1. దూడ పుట్టాక టింక్చర్ అయొడిన్ కట్టు బొడ్డుకి వేయాలి.
2. టెటనస్ టాక్సయిడ్ సూది ఇవ్వాలి.
3. పుట్టాక జున్ను పాలు తాగించాలి.
4. తొమ్మిది ఆరియోమైసిన్ బిళ్లలు, మూడు రోజులు ఇవ్వాలి.
5. నాలుగో రోజు ఎ-విటమిన్ ఇంజక్షన్ ఇవ్వాలి.
6. రెండు వారాల తరువాత ఏలిక పాముల మందు పట్టాలి. తరువాత నెలకొక సారి నాలుగు నెలలు పట్టాలి.
7. గాలికుంటువ్యాధి రాకుండా రెండు నెలలలోపు టీకాలు ఇవ్యాలి.
8. 35 రోజుల తరువాత బూస్టరు ఇచ్చి, 6 నెలల కొకసారి తిరిగి ఇస్తే మంచిది.
9. చీడ పారుడు రాకుండా 4-6 నెలల వయసులో టీకా

ఇవ్వాలి. తిరిగి సంవత్సరానికి ఇప్పించాలి. సంకర జాతికి, విదేశీ జాతులకి అయితే తిరిగి 3-4 సంవత్సరాలకి ఒకసారి ఇవ్వాలి. దేశవాళీ వాటికి అయిదేళ్ల కొకసారి ఇస్తే చాలు.

10. గొంతు వాపు వ్యాధి రాకుండా 6 మాసాల వయసులో టీకా ఇవ్వాలి. తరువాత అన్ని వయసుల వాటికి సంవత్సరానికి రెండుసార్లు జూన్/జూలై నెలలోను, డిశంబరు/జనవరి నెలలోను ఇవ్వాలి.
11. జబ్బ వాపు వ్యాధి టీకాలు అర్ధ సంవత్సరం దాటాక వీలైనంత త్వరలో ఇవ్వాలి.
12. షెడ్డు చుట్టూ సున్నం జల్లుతూ ఉండాలి.
13. రెండు నెలలకి ఒకసారి దూడ వెంట్రుకలు కత్తిరించాలి. ఇలా అయితే గోమార్లు, పేలు, మిన్నల్లులు పట్టవు.
14. దూడల మూతులకి చిక్కాలు తగిలించాలి.
15. వాటికి రోజూ నాలుగు గంటలు వ్యాయామం కావాలి.
16. నెల వయసు తరువాత రోజూ దూడలని కడగాలి.
17. షెడ్డు ఫినాయిలుతో కడుగుతూ ఉండాలి.
18. ఈదురు గాలుల నుంచి వాటికి రక్షణ కల్పించాలి.
19. నెలలోపు దూడలకి ఎండు గడ్డి మీద పడుకొనే సదుపాయం చేయాలి.

## మీరూ చేపట్టండి

పెద్ద పెద్ద డెయిరీల ద్వారా పాల అమ్మకాలు జరుగుతున్నాయి. చిన్న చిన్న సహకార సంస్థలు అమ్ముతున్నాయి. వ్యక్తిగతంగా కూడా చాల మంది అమ్ముతున్నారు. దీనికి ఎంతో అవకాశం

ఉంది. ఇదొక మంచి ఉపాధి కల్పనా కార్యక్రమం. లాభాలు బాగా వస్తాయి. గ్రామస్థులు శ్రద్ధ వహించాలి.

## మరిన్ని వివరాలు

### పాల దిగుబడి

మన రాష్ట్రంలో సంవత్సరానికి 400 కోట్ల లీటర్ల పాలు దిగుబడి అవుతున్నాయి. ఇది 600 కోట్ల లీటర్లకు పెరగాలి.

పాడి పశువుల సంఖ్యలో మన రాష్ట్రం మూడవ స్థానంలో ఉంది. పాల దిగుబడిలో మాత్రం ఆరవ స్థానం.

మనిషికి సగటున ఎన్ని పాలు కావాలి?

మనరాష్ట్రంలో వివరాలు ఇలా ఉన్నాయి:

1956లో ................ 165 గ్రాములు

1987లో ................. 130 గ్రాములు

ఈ తరుగుదలకి కారణం జనాభా పెరుగుదలే.

1995 లో దేశం మొత్తం మీద ........... 190 గ్రాములు

1995 లో మన రాష్ట్రంలో ................. 160 గ్రాములు.

2000 సంవత్సరానికి ప్రణాళిక లక్ష్యం ...... 220 గ్రాములు

ప్రతి మనిషికి సామాన్యంగా రోజుకి
కావలసిన కనీస పాలు ................... 220 గ్రాములు

### సూది సదుపాయం

దీనినే కృత్రిమ గర్భధారణ అంటారు. ప్రభుత్వం దీనికి ఎన్నో సదుపాయాలు కల్పించింది. మూడువేలకి పైగా సంకర జాతి



ఉత్పత్తి కేంద్రాలు ఉన్నాయి. వీటిలో ఇప్పటికి 12 లక్షల పశువులకి సూది సదుపాయం సమకూరింది. రెండు లక్షల సంకర జాతి పశువులు పుట్టాయి.

ఎద్దు నుంచి సేకరించిన వీర్యాన్ని నిలవ చేయడానికి ద్రవ నైట్రోజెన్ అవసరం. దీని ఉష్ణోగ్రత మైనస్ 196 సెల్సియస్. అవసరం వచ్చినపుడు దీనిని పరిశుభ్ర పరిస్థితుల్లో ఆవు యోనిలోకి ప్రవేశపెడతారు.

## విదేశీ ఆవులు

విదేశీ ఆవులు ముఖ్యంగా రెండు. జెర్సీ, హల్సిటిన్ ఫ్రిజియన్.

జెర్సీఆవు లేత ఎరుపు లేదా లేత నలుపు రంగు తెల్ల మచ్చలు ఉంటాయి. ఈ రకాన్నే మన రాష్ట్రంలో జత కట్టడానికి విరివిగా ఉపయోగిస్తున్నారు. అన్ని విదేశీ రకాలలోకి ఇదే అందమైనది. చిన్నరకం. మగ వాటికి వీపు మీద మూపు ఉండదు. ఆవు తొందరగా ఎదకి వస్తుంది. చాలా కాలం బతుకుతుంది. రోజుకి 20-30 లీటర్ల పాలు ఇస్తుంది. పాలు మంచి వాసికి చెందినవి. కొవ్వు బాగా ఉంటుంది. పాలు అందుకే కొద్దిగా పసుపు రంగులో ఉంటాయి.

హోల్స్టిన్ ఫ్రిజియన్ రోజుకి 25-35 లీటర్ల పాలు ఇస్తుంది. కొవ్వు తక్కువగా ఉండడంవల్ల స్వచ్ఛంగా తెల్లగా ఉంటాయి. పాలదిగుబడిలో దీనికిదే సాటి. విదేశీ ఆవులలో ఈ ఆవు చాలా ప్రశస్తమైనది. శరీరం పొడవుగా పుష్టిగా ఉంటుంది. నల్ల చర్మం మీద తెల్ల చుక్కలుంటాయి. తోక చివర కుచ్చు తెల్లగా ఉంటుంది. ఈ జాతి ఎద్దు వీర్యాన్ని సూది విధానంలో మన రాష్ట్రంలో బాగా ఉపయోగిస్తున్నారు. బుద్ధిగా లొంగిఉంటుంది. దూడలు పెద్ద సైజులో ఉంటాయి.

ప్రస్తుతం మన రాష్ట్రంలో 3-4 పల్లెలకి ఒకచోట ఒక కృత్రిమ గర్భధారణ కేంద్రం ఉంది. వీటికి ఈ వీర్యం నిత్యం సరఫరా అవుతుంది.

## జతకట్టే విధానాలు

పశువులని జత కట్టడానికి మూడు విధానాలు ఉన్నాయి :

1. అదే సంతానంలో జత. ఈ పద్ధతిలో ఒకే రకం లేదా సంతతి మగ ఆడ వాటి మధ్య జతకడతారు. దీనికని వాటి మధ్య సరాసరి జత కట్టవచ్చు. లేదా సూది విధానంలో

జరపవచ్చు.

ఉదాహరణకి ఒంగోలు గిత్త ఉంది. దాని వీర్యాన్ని ఒంగోలు ఆవుకే ఉపయోగించడం. దీని వల్ల ఆ జాతి లేదా రకం నాణ్యత మెరుగవుతుంది. ఆ జాతి లక్షణాలు మరింత ఎక్కువ స్పష్టం అవుతాయి. మన రాష్ట్రంలో ఒంగోలు జాతి ఇలా లాభపడుతోంది.

కాని ఈ పద్ధతిలో కొన్ని లోపాలున్నాయి. సంతానంలో శక్తి, సామర్థ్యం తగ్గుతాయి. జాగ్రత్తగా మంచి లక్షణాలను పెంచుకొని చెడు లక్షణాలు తరతరానికి తగ్గించుకోవాలి.

2. తరతరానికి నాణ్యత పెంచడం. దీనినే గ్రేడింగ్ అంటారు. నాసిరకం దేశవాళి పశువులకి ఉన్నతరకం విదేశీజాతి పశువులకి జతకట్టాలి. సరాసరి జతకట్టవచ్చు లేదా సూది విధానం జరపవచ్చు. ఇలావచ్చిన సంతానంలో సగం మంచి, సగం నాసిరకం లక్షణాలు ఉంటాయి. తరువాత తరంలో తిరిగి వీటికి విదేశీ జాతికి జతకట్టవచ్చు. ఈ సారి మరిన్ని మంచి లక్షణాలు వస్తాయి. ఇలా చేసుకొంటూపోతే కొన్ని తరాలలో సంతానం విదేశీ పశువులలాగే ఉంటాయి. కేవలం విదేశీ ఆవులతో జతకట్టవచ్చు. కాని పూర్తి విదేశీ లక్షణాలుండడం మనకి మంచిది కాదు.

మన రాష్ట్రంలో ముర్రా గేదెలని ఉపయోగించి గేదెల నాణ్యతని పెంచుకొంటున్నాము. ఒంగోలు జాతి ఎద్దుని, నాసిరకం ఆవులతో జతకట్టినా ఆ ఆవులు మెరుగైన దూడలని, పెయ్యలని కంటాయి.

3. వేరే రకాల మధ్య జతకట్టడం. మేలురకాలైన విదేశీ పశువులతో జతకట్టడం. సూది విధానం అమలు చేయవచ్చు.

రెండు వేరు రకాల మధ్య జతకడితే వాటి సంతానానికి శక్తి సామర్థ్యాలు ఎక్కువ అవుతాయి. పాలదిగుబడి పెరుగుతుంది.

ఒక ముఖ్య జాగ్రత. సంతానంలో విదేశీ పశులక్షణాలు సగంకన్నా ఎక్కువ ఉండకూడదు. మనదేశ వాతావరణానికి అవి తట్టుకోలేవు.

## దేశవాళి పశువులకి విదేశీ పశువులకి తేడాలు

| దేశవాళి | విదేశవాళి |
|---|---|
| 1. మొదటి సారి ఎదకి రావడానికి 2-4 సంవత్సరాలు పడుతుంది. | 18 నెలలకే ఎదకి వస్తాయి. |
| 2. 4-5 సంవత్సరాల తరువాతనే మొదటి కాన్పు. | 2 సంవత్సరాల 4 నెలలకి మొదటి కాన్పు. |
| 3. సంవత్సరానికి 200 రోజులు పాలిస్తాయి. | సంవత్సరానికి 300 రోజులు పాలిస్తాయి. |
| 4. కాన్పుకి కాన్పుకి మధ్య 2 సంవత్సరాలు ఉంటుంది. | 12 - 14 నెలలు మాత్రం ఉంటుంది. ప్రతి సంవత్సరం కాన్పు ఉన్నట్లే |
| 5. పాల దిగుబడి చాలా తక్కువ. రోజుకి 1-2 లీటర్లు | రమారమి 6 - 8 లీటర్లు. దేశవాళికన్నా 3-4 రెట్లు. |
| 6. ఎదకి రావడంలో ఒకపద్ధతి ఉండదు. | పద్ధతి ప్రకారం ఎదకివస్తాయి. |

## దూడలకి దాణా

దూడలకి జున్నుపాలు తప్పక ఇవ్వాలి. మన వేళ్లు పాలలో ముంచి దూడల నోట్లో పెట్టాలి. అవి చీకుతాయి. పాత్రలో పోసి తాగించవచ్చు. పాలపీక అలవాటు చేయవచ్చు.

పాలు గోరు వెచ్చగా ఉండాలి. లీటరు పాలకి 150 మిల్లీ లీటర్ల వేడి నీళ్లు కలపాలి. సుమారు ఆరో వంతు వేడి నీళ్లు అన్నమాట.

ఏడో రోజు నుంచి దాణా ఇవ్వవచ్చు. దాణాలో తవుడు మొక్కజొన్న, ఉలవలు, బెల్లంమడ్డి, ఖనిజలవణాలు తగినంత ఇవ్వాలి. దాణా వివరాలు ఇలా ఉండాలి - రోజుకి ఇవ్వవలసినది.

| వయసు | దాణా గ్రాములు |
|---|---|
| రెండోనెల | 150 |
| మూడో నెల | 300 |
| నాలుగో నెల | 500 |
| అయిదు, ఆరునెలలు | 750 |
| ఏడో నెల | 1 కిలో. |

## మన రాష్ట్రంలోని వివరాలు

మన రాష్ట్రంలో సుమారు ఒక కోటి పాడి పశువులు ఉన్నాయి. కాని ఇవి చాలవరకు నాసిరకం. దేశం మొత్తం మీద 8 కోట్ల గేదెలున్నాయని అంచనా. ఇవి చాలా వరకు నాసి రకమే. ముర్రాజాతి హర్యానా, పంజాబు రాష్ట్రాలకి చెందింది. ఇది నెమ్మదిగా మన రాష్ట్రంలో ఎక్కువ సంఖ్యలో ఉత్పత్తి అవుతోంది.

అధిక పాల ఉత్పత్తిని శ్వేతవిప్లవం అంటారు. ప్రభుత్వం ఈ రంగంలో ఎంతో శ్రద్ధ వహిస్తోంది.

ఇండోస్విస్ ప్రాజెక్టు ఈ రంగంలో ఉంది. ఇది మన రాష్ట్రానికి సహాయ సహకారాలు యిస్తోంది.

మన రాష్ట్రంలో రోజుకి 1 కోటి లీటర్ల పైనే పాల దిగుబడి జరుగుతోంది. జిల్లా డెయిరీలలో 20 లక్షల లీటర్లు పాలు శుద్ధి చేస్తున్నారు. ప్రయివేటు డెయిరీలలో మరో 10 లక్షల లీటర్ల పాలు శుద్ధి అవుతున్నాయి. మిగతా పాలన్నీ గ్రామాలతో పట్టణాలలో రైతులు ఇతరులు సేకరించి అమ్ముకొంటున్నారు.

నిరుద్యోగులకు ఇదొక మంచి ఉపాధి కల్పనా కార్యక్రమం. ఈ సదుపాయాన్ని తప్పని సరిగా సద్వినియోగపరచుకోవాలి.

## ఆర్థిక సహాయం

స్వయం ఉపాధి పరిశ్రమలు స్థాపించాలని ఉందా! వెంటనే ఆలిండియా సెల్ఫ్‌ఎంప్లాయ్‌మెంట్ అసోసియేషన్, రామన్నపేట, నల్గొండ వారిని సంప్రదించడి.

ఇంకా మీ ప్రాంతంలోని బ్యాంక్‌ను సంప్రదించండి. ఇంకా స్టేట్‌ఫైనాన్షియల్ కార్పొరేషన్, చిరాగ్ ఆలీలేన్, హైదరాబాదు-500 001 వారిని కలవండి.

